శ్రీరస్తు

శ్రీ వేణుగోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీ

# రాఘవ శతకము.

ఇది

గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా కంటెపూడి గ్రామవాసి,
పింగళిమల్ల యామాత్య కామాంబా గర్భశుక్తి ముక్తాఫలాయ
మానుండును, వివిధవిబుధజన విధేయుండును నగు

## వేంకట సుబ్రహ్మణ్య కవిచే

రచియింపఁబడి,

గుంటూరుజిల్లా నర్సారావుపేట తా॥ యడ్లపాడు శివారు
దింటెనపాడు వాస్తవ్యులగు

**కందుకూరి రామస్వామి**

గారి ద్రవ్య సహాయముచే

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె. 1933.

 Rs 0-2-0.

సీ. శ్రీయాజ్ఞవల్క్య ఋ ♦ షికులోత్తంసుఁడై
విఖ్యాతిమై భువి ♦ వెలయునట్టి
శ్రీకందుకూరిసు ♦ శ్రేష్ఠు చెన్నయనాము
భార్య పున్నమ్మ నా ♦ బఱగుచుండు
నామె సత్పుత్రుండు ♦ రామసామ్యాఖ్యుండు
వాని యర్ధాంగియా ♦ జానకాంబ
యాదంపతుల కుద ♦ యంబునొందిరిపుత్ర
పంచకంబందునఁ ♦ బ్రథమ తముఁడు
చిన సూర్యనార్యుండు ♦ చెలగు వేంకట్రామ
బుధుఁడు దుర్గాహ్వయ ♦ పూజ్యతనుఁడు

తే. గీ. వీరరాఘవుఁ డనుపేర ♦ వెలయునొకఁడు
కీర్తిమంతుఁడు గోపాల ♦ కృష్ణమూర్తి
వీరివంశంబు వేర్వేఱ ♦ విన్నవింతు
గీతికలతో న మన్మనః ♦ ప్రీతితోడ.

తే. గీ. సూర్యనారాయణాఖ్యుని ♦ సుదతిమిన్న
రామకోటమ్మయను పేర ♦ రాణఁజెందె
చెన్నకేశవుఁ డాయమ ♦ కన్నసుతుఁడు
పుత్రిక యనంతలక్ష్మమ్మ ♦ పొలుపుఁగాంచు

తే. గీ. ధాత్రి వేంకటరామాభి ♦ ధాను భార్య
కోటిరత్నమ్మ సద్గుణ ♦ కోటిమేటి

యామెకనె సత్యనారాయ ♦ ణాఖ్యనొకని
వరయుమా మహేశ్వరుండను ♦ వంశకరుని.

తే. గీ. కనకదుర్గయ్య యనునట్టి ♦ ఘనుని భార్య
వఱలు వేంకటరత్నమ్మ ♦ పరమసాధ్వి
కాంతు చరణారవిందయు ♦ గంబెతనకు
మోక్షమని యెంచుచుండెడి ♦ ముద్దరాలు.

తే. గీ. వీరరాఘవు సతియాచు ♦ వెలయుచుండె
భువిని హనుమాంబయను పేర ♦ పూవుఁబోఁడి
యామె కొక పుత్త్రుఁడుదయించె ♦ ననఘుఁడైన
కనకదుర్గయ్య సద్గుణా ♦ కరుఁడు నిజము.

తే. గీ. అందు గోపాలకృష్ణయ్య ♦ యతివమిన్న
వెలయ సతిగ స్వారాజ్యముఁ ♦ వేడ్కఁగొనియె
వీరితోఁబుట్టువులుగను ♦ వెలయులక్ష్మి
నరసమాంబయు నన్నపూ ♦ ర్ణమ్మ యనఁగ.

ఉ. వీరలు పుణ్యవర్తన వి ♦ వేకులు సత్యవచో విలాసులుఁ
సూరిజనాళిసేవ కవి ♦ శుద్ధులు వీరలొసంగు ద్రవ్యవి
స్తారమునఁ మదీయకృతి ♦ చంద్రదివాకరులుండునంతకుఁ
ధారిణినచ్చొనర్చితిని ♦ తద్దయ నీయదిగాదె రాఘవా!

కం. కావునవీరలవంశము
భూవలయమునందు వృద్ధిఁ ♦ బొందెడుగాతఁ

భావితకాలమునందును
నీవిలసితదృగ్వ్రాతాన • నియతినిరామా!

కం. నవరత్నంబులఁ జెప్పితిఁ
ప్రవిమల కోదండరామ • భక్తనుగమ్యా
యవినీవుఁ బ్రీతిఁగైకొని
యవిరళమతి మమ్ముఁగావు • మార్తశరణ్యా.

ఇట్లు,
గ్రంథకర్త.

# గ్రంథకర్తవంశావళి.

గీ. శ్రీకరంబగుకొండ వీ ♦ ట్సీమవరము
లోన సత్తెనపల్లి తా ♦ లూకయందు
వరలు శ్రీకం బెపూడి నా ♦ మెరయుపురము
దానమంత్రివరేణ్య సం ♦ తాన మొప్పు. 1

ఉ. వారల వీరరాజను శు♦భంకరుఁడొక్క రుడచ్చమాంబికన్
గూరిమి పత్నిగాఁగొని ఘ ♦ నుండగు వేంకమరాజునప్పరా
డ్ధీరుఁడుసోమరాజునుదృ ♦ ఢీకృతమానసుఁగృష్ణమార్యునిన్
సారసనేత్రుసత్కృపను ♦ జక్కఁగగాంచెఁదనూజులన్ ధరన్

గీ. వారిలో సోమరాజను ♦ భవ్యగుణుఁడు
భద్రమాంబను జేపట్టి ♦ వడసెమల్ల
యార్య, మహాలక్ష్మి వియ్యమ ♦ లనెడి సుతల
మువురుమార్తులు నీరీతి ♦ పుట్టిరనగ.

గీ. అవల మల్లయ శ్రీకామ ♦ మాంబయనెడి
సుదతిఁ బెండ్లాడి వేంకట ♦ సుబ్బరాయుఁ
డనెడి ననుగనె కోటమ ♦ యనగవరలు
పడతినిన్ భార్యగాఁగొని ♦ తనరనంత.

గీ. మల్లికార్జునదేవుని ♦ మహిత కరుణ
మల్లికార్జున రావును ♦ మల్లికాంబ
కలిగిరిక రాజ్యలక్ష్మి నా. ♦ జెలగుసతిని
మలికార్జున రాయఁడు ♦ మహివరించె. 5

గీ. హరిభజనమన్న నాకలి ♦ యనక డప్పి
యనక యదదేక నిష్ఠమై ♦ యలరుచుండి
యపర ప్రహ్లాదుఁడోయని ♦ యనఁగ మల్లి
కాంబగర్భమ్మున సుతుండో ♦ కందుగలిగె. 6

గీ. అపరశారద యీబాల ♦ యనగనొక్క
సుతయు బ్రహ్లాదుఁడననొప్పు ♦ సుతుఁడునుఁ జ
నించిరామల్లికాంబిక ♦ పృథులగర్భ
వారిరాశిని మణులు నా ♦ ప్రభలెసంగ.

శ్రీరామ

శుభమస్తు

అవిఘ్నమస్తు

# రాఘవశతకము

శా. శ్రీలక్ష్మీ హృదయాంతరంగమునవా • సిన్నిల్చిస్వప్రజ్ఞనా
నాలోకంబుల బొజ్జనిల్పి భువిలో • నన్ దేవదేవుండవై
లీలన్దావక భక్తకోటిగృపలా • లింపంగ సీతేశనీ
శ్రీ లావణ్య ముఖాబ్జమెంచి గొలుతున్ • చిత్తంబులో
రాఘవా 1

చ. గిరిపతి బిడ్డకూర్మిసుతు • కిల్బిషహారి శుభాశుభంబులం
దరయగ ముందుసిద్ధమగు • నాద్యుని సర్వగణేశునిన్నిరం
తరముభజింతునామక ప్ర • ధానశుభేచ్ఛల దీర్చినావయున్
నిరుపమమైన ప్రేమసఁడి • నీపదభక్తి నొసంగ రాఘవా 2

మ. మితిలేనట్టి మహార్ణవంబును కపుల్మ్రే • ల్మ్రేలనన్ నీదయన్
ధృతివంతుండయి దాటిసీతఁగని సం • దేశంబులందెల్పి; తా
నతిధీరుండయిలంకగాల్చివనమున్ • బ్రాంచద్ధృతిన్ బీకియా
క్షితి పుత్రిన్గని వార్తదెల్పుహనుమం • జింతించెదన్
రాఘవా 3

ఉ. నన్నయనెఱ్ఱదిక్కనల • నాచనసోమునిభాస్కరాహ్వయున్
వెన్నెలగంటి సూరనను • పింగళిసూరన రామకృష్ణునిన్
వన్నెగణించినట్టి తమ • భక్తుని బమ్మెర పోతనార్యునే
నెన్నెదవాక్యశుద్ధికయి • యెప్పుడు నిన్నునుతింప రాఘవా 4

శా. శ్రీవైకుంఠపురాధి దేవుగనగాఁ • జిచ్ఛాంతియుక్తుండనై
కైవారంబులొనర్చెద న్మదిని నె • క్కాలంబునన్ భక్తిచే
భావానందమొసంగుదాం వనుచున్ • బ్రాక్కర్మబద్ధుండనై
"నావిష్ణుః పృథివీపతే" యనునిరున్ • న్యాయంబుచే
రాఘవా 5

శా. అంతర్యామివిగానైననిన్ను గనకన్ • వ్యామోహబద్ధుండనై
గంతుల్వేయుచు నీచసేవకొఱకై • కాంక్షించి యాకాలిచే
సంతోషించితిగానియెన్నడయినన్ • స్వాంతంబులో నేను నీ
చెంతన్ జేర్చెడి సంధిఁదెల్పు ఘనుల • న్సేవింపనో
రాఘవా 6

మ. అఖిలాండప్రభువీవటంచు హరివం • చావాయుసూనుండు నీ
సఖునిన్ గా హరిపుత్రుఁ జేసితనవా • క్చాతుర్యమున్ జూపి నీ
సఖుఁడై లంకనుగాల్చి నీపదములన్ • స్వాంతంబునన్ నమ్మితా
సుఖమైనట్టి భవాబ్ధిఁ దంబుఁ గనఁడే • శుద్ధాత్ముఁడై రాఘవా 7

ఉ. దేవరదేవిగాంచుటకు • ధీరతతోడను నేఁగుచుండఁగాఁ
ద్రోవకు నడ్డమై సురస • తోడనె మ్రింగఁదలంప నోటిలోఁ
బావనిదూరి తానణువు • భాతి శరీరములోనఁ బెంచియున్
నావల జంపుటన్ గనఁగ • నచ్యుత నీదయఁగాదె రాఘ వా

మ. మతిమంతుల్ సుతులైనతండ్రులకు ♦ ధర్మంబుల్ బ్రతిష్ఠింపరే
మతిహీనుల్ సుతులైనతండ్రులకధ ♦ ర్మంబుల్ బ్రతిష్ఠింపరే
యతిధర్మాత్ములరైన పాండవులు దు ♦ ష్టాచారపారీణులౌ
ధృతరాష్ట్రాత్మజులు సాక్షులౌదురుగదా ♦ దెల్లంబుగా రాఘవా 7

మ. శలభభ్రాంతమూఢివ్వోగాంచి ఫలవి ♦ శ్వాసమ్ముచే భ్రాంతిమై
దెలియంజాలక భ్రమగ్గునట్లు జడులై ♦ దేవా! వృథాభ్రాంతిచేఁ
జెలులం జుట్టములన్ సతీసుతులఁ దాఁ ♦ సేవించు సేవాళియా
యిలలో శాశ్వతమంచు నమ్మి చెడిపోరే? వెఱ్ఱులై రాఘవా 10

శా. విందుల్ సేయఁగలేను గీర్తిబొంగడన్ ♦ విద్వాంసుఁడన్ గాను నే
నందింగనగ లేని వృద్ధుడనహో! నాతండ్రి! నిత్యంబు నీ
యందే భారము నిల్చినాఁడఁ బరులన్ ♦ యాచింపము మ్మాటికిన్
సందర్భంబున నెట్లు బ్రోచెదవో యీ ♦ శా! దేవ!
శ్రీరాఘవా. 11

ఉ. మాయకుఁ జిక్కితన్నుఁ గొని ♦ బ్రమగ్గెడు వారలఁ జూచియట్లె నా
నాయమునఁ గల్లయంచెరిగి ♦ గట్టిగఁ గోరితిఁ దారకంబు "రా
మా" యనుదీదు నా పాఘున ♦ మంత్రము జిత్తమునన్ జపింతునేఁ
బాయక నెల్లకాలమును ♦ భక్తుని భారము నీదె రాఘవా. 12

చ. దశరథరామచంద్ర! నను ♦ ధన్యునిఁ జేసి నీదు కీర్తినిన్
విశదముగాఁగ నాకెదను ♦ వేడ్కను భక్తజనప్రపాల! యో
దశవిధరూపధారి! ఖర ♦ దానవనాథకుటుంబనాశకా!
దశదిశలందు నిండిన ప్ర ♦ ధానపు దైవము! తండ్రి!
రాఘవా. 13

చ॰ చరణములొత్తుభాగ్యమునఁ ♦ సంసృతికారణమైన శత్రులన్
దరుమఁగఁజాలుపౌరుషము♦తారకనామమునెంచుజ్ఞానమున్
నిరతముఁదృష్టిఁజెందఁగల ♦ నేర్పునఁ లక్ష్యమునందునాకునీ
దరహసితాస్యమున్ గనెడి♦తత్త్వమునీయఁగరాదె రాఘవా 14

ఉ॰ ఏటికి బుట్టనిచ్చితివి ♦ యిచ్చినవాఁడవు జ్ఞానసిద్ధి నీ
వేటికొసంగకుంటివి మ ♦ దీప్సితమేటికి దీర్పకుంటివీ
బూటకమైన లోకమునఁ ♦ బూరుషజన్మమునిచ్చి నాకు నీ
పాటుల నొందజేయుటిది ♦ భావ్యమ భక్తునియందు
రాఘవా. 15

ఉ. ఇప్పటికింతలాయె, బ్రతు ♦ కింతకికెంతగన్వృద్ధియౌనొ నే
నెప్పుడుముప్పుమూలమగు ♦ నింద్రియశక్తిజయింపలేకబల్
తిప్పలఁజిక్కితుట్టతుద ♦ దిక్కికనీవని నమ్మినాఁడ రా
మప్ప! భవత్కృపారసమె ♦ మందిక జాడ్యముమాన్ప
రాఘవా. 16

ఉ. ముట్టితి నీపదంబులను ♦ మ్రొక్కులదీర్పఁగఁ జాలెదంచుఁజే
పట్టితి నీదునామమును ♦ పాపముబాపెడిమంత్రమంచులోఁ
బెట్టితి నీదురూపమును ♦ ప్రేమనుబ్రోచెడిమూర్తిమంచునేఁ
జుట్టితి నీపదంబులకు ♦ నూనునిబంధములెల్ల రాఘవా. 17

మ. వచియించెన్ శ్రుతినిన్ను మించుపరదై ♦ వంబింకలేఁడంచుఁదా
రచియించెన్ మునినీదుసచ్చరితమున్ ♦ బ్రహ్మంబునీవంచుఁదా
బ్రచురించెన్ హనుమన్ననీదుప్రతిభన్ ♦ బహిఖ్యాతిగానందుచే
నుచితంబంచును గొల్చుచుంటినినునే ♦ నుల్లంబునన్
రాఘవా. 18

ఉ. నీదుప్రభావమెల్లయును • నీరధి కీయగు గోచరంబిలన్
నీదుప్రతాపమెల్లయును • నిర్జరశత్రులెఱింగియుందురా
నీదుకృపాప్రభావమును • నిన్నెదఁగొల్చుగుహుండెఱుంగుగా
నీదుపదాబ్జపావనత • నిక్కమహల్యయెఱుంగు రాఘవా. 19

ఉ. మాటలవీడువాఁడనని • మాయముసేయగనెంచితేమొ నే
మాటలవీడనయ్యయును • మానములేదిఁక సీతతోడు నీ
చాటునఁ జేరనెంచితిని • సాహసమొప్పగఁ జేరదీసి నా
పాటులఁజూచి బ్రోవుమిఁక • పావని బ్రోచిన రీతి రాఘవా 20

శా. బంధంబుల్ గలవారి బంధువులునిన్ • ప్రార్థించు మాత్రంబునన్
సంధుల్ వీడి సుఖంబులిచ్చునని సు • జ్ఞానుల్ వచింపంగ నా
బంధంబుల్ దెగిపోవు సూత్రమని నే • భావించి నీనామమున్
సంధానంబును జేయుచుంటిమదిలో • సత్యంబుగా రాఘవా 21

ఉ. శంతనరాజసూనుఁడఁట • సంగరరంగమునందులక్ష్యమున్
పంతముతోడ నీపయిని • బంధురశక్తిని నిల్పి ధీరుఁడై
సంతసమొప్ప ఘాత్రమునఁ • జక్రముబట్టగఁ జేసి దేవ! నీ
పంతముతప్పఁ జేసెఁగద • భక్తిబలంబునఁ దాను రాఘవా 22

ఉ. పావనమైనతావకశు • భంబగు నాభి సరోజమందు సం
భావనమాత్రుఁడై పరమ • పావనుఁడై భవదీయపుత్రుఁడై
జీవుల నిర్మపద్ధతిని • సృష్టినిఁ జేసెడికర్తయైన యా
దేవునిగొల్చెదన్ మదిన • తీవ్రముదమ్మున బ్రోవు రాఘవా 23

చ. అభయమునిచ్చి ప్రోవుమిక నర్భకుఁడన్ శరణార్థినయ్య! నన్
శుభకరుఁ జేసి వేగముగ • సుస్థిరమోక్షము నీయవయ్య నీ
విభవముఁ జూచి పొంగదగు • విద్దెలభాగ్యము లీయవయ్య నీ
కభిమతమైన మార్గమున • నచ్యుత నన్ గనవయ్య రాఘవా 24

చ. ఎఱుఁగను యోగసాధనల • నేమియు వస్తువిచారణాంశమే
నెఱుఁగ సదంతరాత్ముఁ గల • యిద్ధచరిత్రయదార్థవస్తువే
నరయను బ్రహ్మజీవులకు • నైక్యవిధానము హంసయానమే
యెఱుఁగ మహానుభావ! ననుఁ • నేగతి బ్రోచెదొ తండ్రి రాఘవా 25

ఉ. పండితులైన వారలకు • బంధురభావముఁ గల్గనిచ్చి భూ
మండలి సిప్రబంధమున • మందయశమ్ము గడించునట్లుగా
మెండుగ దీనఁ సలిపి • మెచ్చఁగఁ జేసెడి దాతవీ వెగా
నిండిన నీయశంబిలను • నిల్చుకొనన్ వలెగా దె రాఘవా 26

ఉ. చుట్టితి నాదుభారమును • సూర్యకులోద్భవ నీదు కాలికిన్
బెట్టితి నాశఁ దీర్తువని • ప్రీతిని నీవయి కొంతలక్ష్యమున్
గట్టితి కంకణంబునను • గాచెదవంచును నమ్మి చేతికిన్
బట్టిన పట్టు వీడనిక • భక్తునిఁ బ్రోవగరమ్ము రాఘవా 27

ఉ. తానటునంపశయ్యపయిఁ • దామరసాక్ష! నినున్ దలంచుచున్
గానక క్షుత్పిపాసలను • గౌరవమొందుచు భీష్ముఁడొర్పుమె
మానుగఁ బెక్కుధర్మముల • మానుషశక్తిని ధర్మరాజస
న్మానము నొంది చెప్పెగద • మాధవ! నీకృపచేత రాఘవా 28

చ. ఉడుతనుజూచియిచ్చితివి • యోగ్యపథంబును మెచ్చి భక్తికిన్
వడిగ జటాయు నేలితివి • స్వర్గసుఖంబుల దండకాటవిన్

బుడమి నహల్యశాపమును • బుచ్చిననీకృపకొంతనాపయిన్
గొడుకితఁ డంచుఁ జూపుటకుఁ • గూరిమిదిక్కనీవె రాఘవా 29

శా. రామా! నీకరుణాప్రభావమున దూ • రంబౌగదా పాపముల్
నామోచ్చారణచేతలోపల వెలిన్ • స్నానంబమై తోఁచునీ
సామీప్యంబున జేరినాఁడసుతుఁడన్ • సంపూర్ణవాత్సల్యతన్
నామీఁదన్ దగజూపినిత్యసుఖముల్ • నాకయవే రాఘవా 30

ఉ. చేసితి ఘోరపాపముల • చేటునెఱుంగక యావనంబునన్
మోసముఁ జేసినాఁడ భువి • మోహపిశాచముఁ బూనినంతనే
కాసులకోసమై పరుల • కాఁగలకర్మము లెంచబోకనీ
దాసునినెట్లుగాఁచెదవొ • తండ్రివిధంబున జూచి రాఘవా 31

ఉ. భాసురహృద్విలాసమగు • భాషలసంస్తుతిఁ జేయఁ జాలకు
ల్లాసముతోడ నీముఖవి • లాసము మాత్రముఁ జూడనెంచిమీ
ధ్యానము వీడకుంటినిర • తంబును లోవెలి నీవెయంచునో
వాసవవంద్య! నాకొరఁత • బాపెడిదిక్కనివె రాఘవా 32

చం. జలనిధిశోష్యకంబుదను • జాదులు దోమలుగోలికాయలా
కులగిరులట్లునెంచి తన • గుప్పిలిపోటుల లంకలోనబల్
బలనిధులైన రాక్షసుల • భస్మము సేయగజాలుశౌర్యముల్
కలుగుట యాంజనేయునకుఁ • గాంచగ నీదయగాదె
రాఘవా. 33

ఉ. శ్రీకరులైన భక్తులను • శీఘ్రమె బ్రోవగనెల్లవేళలన్
బ్రాకటవైభవంబునను • రాజసమొప్పగ ధర్మవద్ధతిన్

లోకమునందుబుట్టితని ♦ లోకులు చెప్పఁగ నమ్మిగొల్చితిన్
జేకొని బ్రోవుమింకనను ♦ జిన్మయరూప! మహాత్మ!
రాఘవా. 34

చ. ఎఱుఁగఁజిదంబరంబనఁగ ♦ నెచ్చటఁగల్గి సుఖంబులిచ్చునో
ఎఱుఁగను నాదుబిందుకళ ♦ లేగతిఁజేరి లయంబుఁజెందునో
యెఱుఁగనుషుమ్న నాడిపయి ♦ కేగతిఁబ్రాకునో, లీనమేడనో
యెఱుఁగను గూటమెట్టిదియొ ♦ యేగతి దాసునిబ్రోతు!
రాఘవా. 35

మ. వరమౌనీంద్రులు యోగదృష్టిఁగనిసం ♦ భావించి యైక్యంబుగా
వరిముల్లంతప్రమాణమంచు శ్రుతులన్ ♦ వర్ణింతుసీరూపమున్
బరికింపన్ మముబోంట్లకెట్లు వశమౌ ♦ బ్రత్యక్షమౌనట్లునీ
వరరూపంబును జూచుభాగ్యమది కై ♦ వల్యంబెగా
రాఘవా. 36

ఉ. కక్షవహింపకయ్య నను ♦ గావగలంచమునీయనంచునే
శిక్షవిధింపకయ్య తగు ♦ సేవలఁజేసె నితండటంచు సం
రక్షణఁజేయవయ్యనిజ ♦ రాజగుణంబును వీడుమయ్యనా
పక్షముఁబూనుదక్షుఁడవు ♦ బంధుఁడవీవిఁక నాకురాఘవా. 37

చ. మధువనురక్కసున్ దునిమి ♦ మాధవ! ధర్మమునిల్పిపృథ్విలో
బుధనుతిగాంచి సర్వపరి ♦ పూర్ణుడవంచుననేకభంగులన్
వ్యధలనుమాన్పిభక్తులకు ♦ వాంఛలొసంగితివట్టివన్నియున్
వృథయగుఁగాదె నాపయిని ♦ వేడ్కను జూపకయున్న
రాఘవా. 38

ఉ. సుందరంబైనమూర్తిఁగని • సుస్థిరభక్తిని మానులందఱుం
బొందుగ నీదుకౌఁగిలిని • బొందఁదలంచిననీవెఱింగి మీ
రందఱు ముందుగోపకుల • మందునఁ బుట్టుఁడు నేనుశౌరినై
యందఱికోర్కెఁదీర్తునని • యాడినవాఁడవుగావె రాఘవా. 39

మ. భవదీయాద్భుతదివ్యతేజమునుమహాత్పద్మాంత రాళంబులోఁ
నవలీలంగనలేక ధాతృముఖులుఽత్యంతప్రయత్నంబుతోఁ
జివరన్ గాంచిమహాత్ర్పపూర్ణులయివా • సిఁ జెందుచున్నారెయీ
భవయుక్తిన్ ననుఁబ్రోవ భారమగునా • పద్మాపతీ
రాఘవా. 40

ఉ. నల్లనిమేఘమధ్యమున • నాణ్యతరంపుమెఱుంగుచాడ్పునన్
ఫుల్లసరోజమందు పరి • పూరితదీప్తులు ప్రజ్వలింపఁగాఁ
గొల్లగ పీత కాంతులను • గూడిన యవ్వరి ముల్లురీతిగా
నుల్లము తేజరిల్లునటు • లొప్పుచునుందువీవె రాఘవా. 41

శా. వేదాతీతుఁడవైన నిన్నెటులగా • వీక్షించిరో దేవతల్
మోదంబారనెటుల్ మునుల్ గొలిచిరో • ముక్కోణపీఠంబు
నన్। వేదాంతుల్ మతిఁదారకంబని నినున్ • వేమారెటుల్
మ్రొక్కిరో। యాదారిన్ నినుగాంచనాకుదరమా • నాజన్మలో
రాఘవా. 42

చ. విడచితి దేహభావమును • వీడితిమామక ద్రవ్యబంధులన్
విడచితి శత్రుపక్షమును • వీడితి నైహిక భోగవాంఛలన్
విడచితిఁ గాని సర్వమిల • వీడఁగఁ జాలను నీపదంబులన్
బడితినిబట్టుబట్టితని • భక్తుఁడరిక్తుఁడఁబ్రోవు రాఘవా. 43

ఉ. దేహమనిత్యమయ్యె భువి • దేహ సుఖంబులనిచ్చువానిపై
నూహలు రిత్తలయ్యె మది • కొప్పినవారలుదూరమైరి యు
త్సాహముతీరదాయెధన • ధాన్యములందున మూలమైన
వ్యా! మోహము వీడదాయెగద • ముక్తుఁడనేనెటులౌదు
రాఘవా. 44

ఉ. ఎవ్వని కెవ్వడౌనో యిల • నెవ్వనికోసము వచ్చె నెవ్వడో
యెవ్వరికైన గోచరమె• యేగతిఁ గల్గునొముందునెంచకే
జివ్వకుకాలుద్రవ్విపర • చిత్తమునొవ్వగ నంత్యమందుఁదా
గవ్వకుగాకమానవుఁడుఁగాలునిప్రోలికిఁబోఁడొ రాఘవా. 45

ఉ. జీవికి నాత్మకుం గలుగు • చిత్తవికారములెంచి చూడఁగా
జీవుడెయాత్మయయ్యెనువశీకృతసేంద్రియుఁడై సదా మహా
దేవుని భావమున్మఱచి • దీనత గాంతలదాసుఁడై వృథా
సేవలఁజేయుచుండుటను• క్షేత్రవికారతనొందె రాఘవా. 46

ఉ. భక్తియనంగ శుద్ధమగు • భావముచేనినునెంచుచుం సదా
శక్తికొలందిదానమును • సల్పుచుఁదృష్ణనువీడిశాంతుఁడై
రక్తిని తావకార్చనము • ప్రజ్ఞనుఁజేసెడు లక్షణంబులే
ముక్తికిమూలమంచనిరి•మూఁడుమతంబులవారు రాఘవా. 47

ఉ. శాంతులు యోగిసమ్మతులు • సత్వగుణాఢ్యులునైన
పాండవుల్
భ్రాంతులులేక శంకరుని • పాశుపతాదుల గొన్నవారలై
వింతగదోసిలొగ్గి వృధ • వీవర! తావక యాజ్ఞదాఁటక
సంతసమొంద నీహితము • సల్పరె కర్తిగడింపరాఘవా. 48

చ. కమలదళాక్షనిన్నుఁగను • కన్నులెకన్నులటంచిచూచినన్
విమలచరిత్ర నీచరిత • వీనులవిందుగవిన్న వీనులౌ
నమలగుణాబ్ధి నీదగుమ•హాత్మ్యమునెంచెడిజిహ్వజిహ్వయా
సమరసభావనిన్ మఱచు• జన్మముజన్మమెపృథ్విరాఘవా.

చ. హరిసుతుకోర్కెదీర్చితి మ•హాంబుధిగర్వముడించివైచితా
హరిపయిఁబవ్వళించితివి • యంచితకీర్తి గడించియుంటి వీ
ధరఁగల నాదుభక్తులను • ధన్యులఁజేతునటంటివిట్టి నీ
కరయఁగనన్నుఁబ్రోచుటది • యా బహుకష్టము, దేవ! రాఘవా.

చ. రఘుకులమందుబుట్టి ముని • రాజులకోర్కెలుదీర్పజ్ఞానివై
వఘుచులుపెక్కజేసి యిల • మానవరూపముదాల్చి రాజులం
దఘురహితుండటంచు సుగు • ణాకరులందఱుమెచ్చసీతకై
యసుటితశక్తిఁజూపితివి • యర్థులవాంఛలిడంగ రాఘవా.

ఉ. కొండఱునిన్నునమ్మితమ• కోర్కెలభింపఁగఁ బూర్వదేవులై
సందడిసేయవృత్తులను•శాంగమునేయుచుసాంతమందువా
క్చందన పుష్పదామములఁ•జాలఁగమానసపూజఁ జేసియుం
పొందఁగదృష్టి నిల్పిపర•మోత్సుకముల్గనలేదెరాఘవా 52

చ. కపికులమెల్ల నీకుఁ బడి • గాపులరై పరిచర్యసేయుటన్
తపసులునీదునామమును• దారకమంచునుతించుచుండుటన్
నృపగతపాపులై భువిన•నంతసుఖంబుల నొందుచుంద్రు నీ
యపరిమితానుకంపమున• కాసజనించియెగాదెరాఘవా. 53

ఉ. భక్తులకాపదల్ గలుగఁ • బాపులుకొందఱు వేచియుండఁగా
భక్తినినున్ స్మరించఁగనె • పాపులద్రుంపగవత్తువంద్రునిన్
రక్తిని నెల్లకాలములఁ • బ్రార్ధనసేయుచునుండినట్టి య
వ్యక్తుని నన్నుఁబ్రోవు పసి•బాలుని బ్రోచినరీతిరాఘవా 54

మ. బయలేకొందఱు బ్రహ్మమందురనినన్ • భావార్ధమున్
గాంచినన్
బయలందుండియుఁదానికెట్లు పలుకున్•బ్రహ్మంబుతోలో
వెలిన్
నయమొప్పారగ నిండియుండి పరభి • న్నపాప్రియభావా
జ్ఞతన్
బయలేనేననివాగుచుంద్రునినుసం• భావింపకన్ రాఘవా 55

ఉ. నారదమౌని పూర్వజన•నంబున బాపలయింటఁదల్లితోఁ
జేరి విశేషపూజలను • జేయుచునుండఁగఁ దల్లిపాదమున్
ఘోరవిషంబు గ్రక్కుచొక•క్రూరభుజంగముముట్టినంత వే
సారక నిన్నువేడి జవ•సత్త్వములన్ గనలేదెరాఘవా 56

చ. తరణికులప్రదీప నిను • ధన్యులు తారకమూర్తియంటచే
సరసిజనేత్రయయ్యదియె • సత్యమటంచని మోక్షకాంక్షచే
నిరుపమమైనభక్తిమది • నిల్పి నినున్మది నమ్మినాఁడ నీ
ధరపయి దిక్కులేరనుచు • ధ్యానముఁజేయుచునుంటి
రాఘవా 57

ఉ. కోరికఁదీర్చెదంచు నల • కుబ్జకువక్రతఁ దీర్చితంచు సం
సారిగ నొప్పితంచునరు • సారధియై జయమిచ్చితంచుభూ

భారముఁదీర్తువంచుఁ దమ • భక్తులవాంఛలనిత్తువంచు నేఁ
గూరిమితోడనుంటినిను • గూడెడిభాగ్యముఁగోరి
రాఘవా. 58

మ. శివనారాయణభేదముల్ గనకతా • శ్రీశైలవర్యంబునన్
భవరాహిత్యముఁ బుంద్రోవగాంచినిజమా • బ్రహ్మంబుజూడంగసం
స్తవనీయుండగు మద్గురుండు చనితా • ద్వంద్వంబటంచెన్నకన్
శివనారాయణలోకముల్ గనెను వా • సిన్నిఁదయన్ రాఘవా. 59

ఉ. రామభవత్ప్రచారముల • రాఘవయన్మకుటంబునుంచినే
నీమముతోడఁ దెల్పితిని • నీకు; దనున్ గరుణించివేగమే
కామితవస్తువిచ్చి శత • కంబుచునిల్పుము శాశ్వతంబుగా
భూమినిదీనదోషపద • ముల్ గడునున్న క్షమించు రాఘవా. 60

మ. రమణీయుంబగు నీదురూపమును భా • రద్వాజుఁడెల్లప్పుడున్
విమలాంతర్గతపుండరీకమునఁదా • వీక్షించియానందుఁడై
స్వమతంబున్ దనపేరనిల్పెభువినా • చంద్రార్కసంస్థాయిగాఁ
గ్రమతన్ మత్పితృడట్టి గోత్రభవుఁడై • గ్రాలెన్ సుధీరా
రాఘవా. 61

ఉ. యోగిమనోబ్జలోలునకు • యుద్ధవమానసబోధమూర్తికి
న్నాగవిరోధివాహునకు • నవ్యతరోన్నత సచ్ఛరీరికి
న్నాగమవేదవేద్యునకు • నార్తజనావన సత్ప్రభాసికి
సాగిలి మ్రొక్కెదన్ ననుద్ర • కాంతునిజేసి భరింప
రాఘవా. 62

ఉ. రావణగర్వభంగ! యసు • రారిభ్యాదంబుజభృంగ! రంగ! యో
దేవ! మహానుభావ! కడ • తేర్పుము నన్ను కృపాంతరంగ నీ
పావనమైన రూపమును • స్వాంతమునన్ విడజాలనయ్య వే
రావ కృపాప్రభావవర • రాజలలామ రమేశ రాఘవా. 63

శా. మీనామంబు సహస్రనామములకున్ • మేలై నదన్ భ్రాంతిచే
నానారీతులఁ జూచిచూచి శివుఁడా • నందంబుచే భార్యకున్
దానీనామమె తారకంబయిన శు • ద్ధబ్రహ్మమంచున్ సదా
యానందప్రదమంచుఁ జెప్పె నుపదే • శార్థంబులన్ రాఘవా. 64

చ. అరయఁగ మర్త్యలోకమున • నారనిభక్తియె ముఖ్యమాటచే
నరనులు సర్వశాస్త్రములఁ • జక్కగ సాంతముఁ జూచి భ్రాంతిచే
స్థిరమగు మోక్షమార్గమును • జెందెదు త్రోవ నెరుంగలేక నీ
కరుణకు పాత్రులై స్థిరసు • ఖంబులఁ గాంచరె తొల్లి రాఘవా. 65

ఉ. భూమిని యజ్ఞసత్ఫలము • బొందగ నీయక యున్న తాటకన్
తాపసినిన్ వధించుటకు • తాపసియొక్కఁడు వచ్చి తండ్రితో
రామునికోసమై యిటకు • రావలసెన్ జుమియంచు దెల్పగా
నీమహిమం బెరుంగక ప • ఠింగొని వేరుగ నెంచె రాఘవా. 66

ఉ. గాధిమహాత్మ సేనఁ బహు • కాలము బిడ్డలులేనివాఁడనై
వేధను గూర్చి యజ్ఞములఁ • వేయిటిఁ జేయఁగఁ దత్ఫలంబునన్
సాధుల నల్గురాత్మజుల • సత్కరుణన్ దయచేసె నాకు నో

సాధు! యటంచు నిన్వీడువఁ • జాలకఁ బల్కెడి రాజు
రాఘవా. 67

క. వీరల రాముఁబంప్రుమని • వేడితివయ్యా మహానుభావ యీ
వ్వీరలు యుద్ధకర్కశులు • బాలుఁడు మోహనమూర్తి
క్రూరులౌ
ధీరుల నెల్లఁజంపును గాధివర! తెల్పుము నీవెయంచుఁదాఁ
గూరిమిఁజూపెగాదె జన • కుండు కుమారుఁడవంచు
రాఘవా. 68

ఉ. రామునిపిడిసేను ముని • రాజసుధీమణి! యుండఁజాల మా
రాముఁడు కంటకాటవుల • రానెరుగండు మహాత్మ!
కన్నులన్
రామునిగాంచకున్ననిలఁ • బ్రాణము లేగతినిల్చునంచుఁదాఁ
బ్రేమముఁజూపెఁ బృథ్విఁగల • బిడ్డలకీతిని నెంచి రాఘవా.

ఉ. పిమ్మట మానితోడఁ జని • ప్రేమను యజ్ఞముఁగాచి
యంతలో
కమ్మలు మెచ్చజానకిని • గైకొని వైభవ మొప్పరాగమా
ర్గమ్మున భార్గవుంగెలిచి • కానకగానకఁ గన్నతండ్రికిన్
నెమ్మది సంతసింపగను • నిక్కపు బిడ్డఁడవైతి రాఘవా.

చ. బలములు చుట్టగొల్వఁగను • భద్రగజంబు నెక్కిసీతతోఁ
బలుకుల తేనెలుట్టిపడఁ • బల్కుచుఁ దమ్ములుభక్తిగొల్వఁగన్
జలరుహనేత్ర లందఱును • చక్కగ హారతులీయ శోభచే
వెలయు నయోధ్య జేరితివి • వేడుకతో నలనాఁడు రాఘవా.

ఉ. ధర్మమటంచు తల్లులకుఁ ♦ దండ్రికి మ్రొక్కఁగ నిన్నుఁ గాంచి నీ
ధర్మిణియున్ యథాగతిని ♦ ధర్మము సల్పగ మోదమందుచున్
నిర్మలచిత్తవృత్తి భువి ♦ నిల్పుము ధర్మమటంచు దీవెనల్
ధర్మముగానొసంగిరి గ ♦ దా బుధులందఱు నాఁడు రాఘవా 72

చ. ఘనుఁడవు గాన నీవు భుజ ♦ కార్ముకదీప్తులు ప్రజ్వరిల్లగా
వనమున నున్న రక్కసుల ♦ వాఁడిశరంబులఁ గోసి నంజుడున్
ఘన మృగ పక్షిజంతులకు ♦ గ్రాసముగా గనుఁబెట్టి యజ్ఞమున్
జనములు మెచ్చఁగాచితివి ♦ శౌర్యగుణాబ్ధివి గావె రాఘవా. 73

మ. తమ రే రక్షకులన్న సూక్తి వినకన్ ♦ దారాసుతభ్రాంతిచే
మమతన్ ద్రవ్యముఁ గూర్చినాఁడ నిలలో ♦ మాయాగుణోద్రేకతన్
తమిచే కాలముఁ బుచ్చినాఁడ సుమి నిన్ ♦ ధ్యానింపకన్ వెఱ్ఱినై
తమిదీరెన్ గతినీవె యింక నిపుడో ♦ తండ్రీ తగన్ రాఘవా. 74

మ. వర గోదావరితీరమందుఁ గల శ్రీ ♦ భద్రాద్రియందుండె మా
కరుణాసింధుఁడటంచుఁ జెప్పఁగొని భ ♦ క్తవ్రాత ముప్పొంగుచున్
పరమానందము నొందుచుందురుగదా ♦ పద్మాక్ష! నిన్నెంచి నీ

చరణాబ్జంబుల మాళిదాల్చితి ప్రభూ! • సాకంగదే
రాఘవా. 75

ఉ. అనయము వెఱ్ఱులట్లు తమ • రన్నదె నిత్యమటంచు నవ్వ
చుర్
కని కనకుండ నంధుగతి•గాతమలోని నిజంబుఁ గాంచుచుర్
విని వినకేగుచుండి పృథి • వీపతినైన నను లెక్కసేయరా
మనమున నిన్ను నిల్పు వభి • మానుల భాగ్యము నిమ్ము
రాఘవా. 76

ఉ. భావమునందు నిన్నుగనుఁ•భాగ్యముగల్గిన సజ్జనాళికిర్
కేవల గద్గదస్వరము • కీర్తనఁ బాడుచు నున్న కన్నులర్
బావనమైన యశ్రువులు•పై పయినొల్కుచు దేహమంతనీ
సేవను వేగగుర్పొడిచి•శీఘ్రమె చింతలఁ బాపురాఘవా.77

ఉ. సరస ముఖాబ్జకాంతులిల •శాంతివహింపగ నంతకంతకుర్
నిరతము దేహభావము గ • ణింపక నింద్రియచేష్టలన్నిటిర్
వరుసగ నొక్కటొక్కటిగ • వాస్తవమైన భవత్ప్రకాశ
మం
దరయఁగఁజేర్చి మగ్నుఁడగు • నట్లుగనర్ గృపజూడు
రాఘవా. 78

చ. ఇలవరిపూర్ణులెల్లపుడు • నెద్దియొ చూచుచు నుండినట్లుగా
తలఁపులులేని యొక్కవిధి • ధారణజేయుచు ద్వైత భావ
ముర్
విలసిత శూన్యదేశమున • వేడుకనిల్పుచు లింగభేదముర్

దలపక తత్త్వవేత్తలయి ♦ తారకమీావనియుంద్రమ
రాఘవా. 79

చ. మనసుసఁగల్గు చంచలత ♦ మాన్ప నసాధ్యముగాన
దానికై
యనువగు రెండునాడులను ♦ నైక్యముజేయఁగ మధ్య వీధిలోఁ
గనుఁగొను-చోట ధీరుఁడయి ♦ కాత్మమురీతి చలింపకుండు న
ట్లనిశము నభ్యసించ బర ♦ మాత్మను నీఁ గనలేరె
రాఘవా. 80

ఉ. కొందఱు జ్ఞానయోగమను ♦ కొందఱు కొందఱుకర్మయో
గమం
చందురుగాని రెండునొక ♦ టైకడుసౌఖ్యమునిచ్చునంత్యమం
దెందులకో యిటుల్ పలుక ♦ నిన్నిటికిఁ భువికర్తవైన గో
విందుఁడ వీవెకావె మరి ♦ వేరెవఁడింక సమానుఁడు రాఘవా.

ఉ. దేహికిచోటులేక ప్రతి ♦ దేహమునందును స్వల్పరూపివై
సాహసమొప్ప కాపురము ♦ సల్పుచునుండియు మాయ
కాంతతో
మోహముచే సుతాదులను ♦ ముగ్గుర నల్గురఁగాంచి యా
పయిఁ
స్నేహముచేనరుండు నినుఁ ♦ జింతనసేయఁడుగాదె రాఘవా.

ఉ. కాలుజయించినట్టి కర ♦ కంతుఁడుగాక మఱెవ్వరయ్య నీ
లీలలఁగాంచువారలు భ ♦ లీ భువిమోహవికారచేష్టలఁ

కాలముఁ బుచ్చి పుచ్చి తుదఁ ♦ గాలుని ప్రోలికిఁ జేరుకూళ, యే
లీలను నీదుమాయగుణ ♦ లీల గ్రహించగ నేర్చు రాఘవా. 83

శా. బాధల్ మిక్కుటమయ్యె యొంట్లుగడచెఁ ♦ బ్రాక్కర్మచే
ముక్తినిన్
సాధింపంగ శక్తి చాలదిక నా ♦ స్వాంతంబు శాంతింపఁగా
బోధింపంగ కర్తవై వెజనకా! ♦ పుత్రుండుగా నెంచి శ్రీ
నాధా! నన్నెటులైన బ్రోవుమదియున్ ♦ న్యాయంబె కా
రాఘవా 84

చ. తపములు సేయలేదు తగు ♦ దానము ధర్మము సేయలేదు నేఁ
గపటపు బుద్ధితోడ కని ♦ కానకఁ జేసితి బెక్కు పాపముల్
చపలగుణార్ణవంబునను ♦ సంబర మొందుచు మున్గిపోయితిన్
కుపితుడ నేఁ మెంచకను ♦ నూరిమితో క్షమియింపు రాఘవా.

ఉ॥ కొందఱియందు ద్వేషమును ♦ గొందఱియందున స్నేహ
భావమున్
జెందక సాక్షివై సకల ♦ జీవులయందు సముండవౌచు నీ
వందఱియందు సూక్ష్మగతి ♦ నద్భుతశక్తి నటించుచుంటబల్
సందియమాయె నన్నుగని ♦ సాకకయుండుటచేత రాఘవా.

మ. సుకవుల్ తావక సచ్చరిత్రముల సం ♦ శుద్ధార్థసంధానులై
యకలంకస్థితి గద్య పద్యములతో ♦ నానందమానట్లుగా
ప్రకటంబొప్ప రచించి ముక్తిఁ గనరే ♦ పాండిత్యమే పారఁగన్
సకలాత్ముండవు గాన నల్పకిని నన్ ♦ సైరింపుమో
రాఘవా. 87

ఉ. దుష్టులు రేఁగి సాధుల య ♦ థోచితకర్మల సాఁగనీయకన్
నష్టము సేయునట్టి యెడ ♦ న్యాయమునిల్పఁగ మధ్యవర్తివై
కష్ట విముక్తిఁ జేతువని ♦ కష్టములన్నియు విన్నవించితిన్
స్పష్టముగాఁగ నీకు నిక ♦ భక్తుని కష్టమునీదె రాఘవా. 88

ఉ. ఆదిని కర్మయోగమును ♦ నాపయి భక్తిని జ్ఞానమంతటన్
వాదులుగాక మూఁటినొక ♦ భావముచే సతతంబుసల్పుచున్
భేదము లేక ప్రేమమున ♦ విశ్వము తానొకరూపమౌనటం
చాదికిమూలమెంచిన కృ ♦ తార్థతనందదె జన్మ రాఘవా 89

ఉ. కుండలిశక్తి మేల్కొలిపి ♦ కూటమునియై తగు మంచెయుం దు బ్ర
హ్మాండము నిండియుండెనని ♦ యార్యులు స్వానుభవంబు నన్ వివు
న్నండలిఁ జూచి తెల్పిరది ♦ మాటలకేగతి గోచరంబు నీ
నిండు కృపాబలంబనెడి ♦ నిచ్చెన నెక్కిన గాదె రాఘవా. 90

చ. రమయితి "రామరామ" యను ♦ రాముని మంత్రముచేత లోకముల్
సమతను నిండియుండ నది ♦ స్వామునెరుంగఁగ లేక దానికై
క్రమముగ సర్వదేశములఁ ♦ గాంచగ నేగుదురయ్య యింటిలో
నమృతమువీడి కల్లుకొఱ ♦ కై జను మత్తులపోల్కి రాఘవా.

శా. ఏమో వృద్ధుఁడు చెప్పినాఁడనుచు నీ ♦ వీగ్రంథ సద్భావనన్

మోమోటంబును వీడి చూడవలయుఁ • ముద్దారఁ గా
కున్న-చో
స్వామీ! యేమిఫలంబు దీనికిక నా • సామర్థ్యమావ్యర్థమా
నే మీదాసుఁడనంచునన్నెరుగవే • నిక్కంబుగారాఘవా.

చ. ఇదివరకెందఱో నిను న • నేకవిధంబుల బ్రస్తుతింపఁగా
సదయుఁడవయ్యు దోషముల • స్వాంతమునందుఁ దలంప
కెంతయుఁ
ముదముగ తెప్పలొప్పలని • మోక్షమొసంగితిగాదెయట్టులే
సదమలమూర్తి! నామనవి • చక్కఁగఁ జేకొనుమయ్య
రాఘవా. 98

మ. బలమాతగ్గెను నేత్రదృష్టితొలఁగెఁ • బాహ్యేంద్రియం
బుల్ గనఁ
నెలవుల్ దప్పుచునుండె నింతదనుకఁ • నిన్నెంచగాతీరుకల్
గెలుగఁ లేకనెయుంటి నిప్పుడికనఁ • గాపాడి రక్షింపఁగా
బలసామర్థ్యములం బొసంగగనినుఁ • బ్రార్థించెదఁ
రాఘవా. 94

మ. సగకాలంబుపయిఁ గతించెపుడమిఁ • సంసారబంధంబుచేఁ
దెగిపోనీయవు పూర్వవాసనలునఁ • దేవా! యథార్థంబుగా
మొగమోటంబునకై నగానితమనా • మోచ్చాటనంబించుకఁ
విగతజ్ఞానముచే దలంపనయితిఁ • విద్యార్థినై రాఘవా.95

ఉ. మూలనులేనిదందురిది • మూలముగల్గెనోలేదో? యేలనా
మూలము నీవెనీవెయని • మొఱ్ఱలపెట్టుచు విన్నవించుచుఁ

కాలముఁబుచ్చుచుంటి నను • కన్నులఁగాంచి మదీయపాపని
ర్మూలముఁజేసి నిత్యమగు • మోక్షమునిత్తువటందు రాఘవా.

ఉ॥ శ్రీహరి! నీదుచింతనము • జేసెడివారల దోషరాశి సం
దేహములేక భస్మమగు • దివ్యపథంబునుజూపి నిత్యము
త్సాహముతోడ యైహిక వి • చారములం గలఁ జేరనీకనీ
దేహముబాసినంత భవ • దీయ సమక్షముఁ జేర్చు రాఘవా.

ఉ. ఏగతి రాజహంసములు • నింపుగఁగోరు సరోవరంబు దా
నేగతి వానకోయిల గ్ర • సింపఁగఁగోరునో మేఘపంక్తి దా
నేగతి జక్కవంబు గ్రహి • యింపఁగఁగోరునో చంద్రకాళి నే
నాగతిగోరుచుంటి నిను • నాశలఁదీర్చెద వంచు రాఘవా. 98

ఉ. కాననమందు వానరులు • గంతులువేయుచు నాడునట్లుగా
మానవులెల్ల మత్తులయి • మాయలగంతులువైచుచుంద్రు నీ
స్థాన మెరుంగలేక నిజ • ధర్మ విచారణజేయనేరక
న్మానము మానమంచు నను • మానము నీడఁగలేరు
రాఘవా. 99

మ. జగదీశా! మగధాదు లల్గిచెడి రా • చక్రానలజ్వాలలన్
మృగమధ్యన్ గొని రావణుండు చెడె గ • ర్వీ భూతుఁడై
మోహియై
పగచే కంస ధరాధినాథుఁడసి లో • బ్రాణంబులన్ వీడడే
జగతిన్ నీసరివారలేరి? జనకా! • సాష్టాంగమో రాఘవా.

చ. కలియుగ మైదువేలపయిఁ • గాంచగ నిర్వదిమూఁడువత్సర

మ్ములు గతమైన కాలమున • బూనితి నీశతకమ్ము నీ
కృపన్
జలరుహనాభ! యిచ్చితిని•శాంతిని జేకొని నన్ను ధన్యుఁగా
సలుపుము నిందునందు సుఖ • సంభవమౌనటు నన్ను
రాఘవా. 101

చ. పుడమిని దుందుభిన్ మరియు • బొందుగ మార్గశిరమ్ము
నందునన్
గడువడి కృష్ణపంచమిని • గ్రంథము మామక బుద్ధిదీరవిూ
కిడితిని స్వీకరించి నను • నిప్పుడు బ్రోవగరాదె తండ్రి తా
బుమతులఁ బ్రోవకున్న నిఁక•ఁబోషణ బిడ్డలకేది రాఘవా.

ఉ. ఎట్టిదియైన నాకవన • మెంచక శబ్దము బ్రహ్మమాటచే
గట్టిగ నట్టినమ్మికను • కామిత వస్తువొసంగ నీవు నూఁ
గొట్టెదవంచు వేడుకను - గూర్చితి నీకొక పద్యమాలచే
పట్టి వరంబొసంగి విని • పావను సేయుమినన్ను రాఘవా.

సీ. శ్రీహరి హరులను • సేవించి నిత్యమా
భక్తిచే ముక్తిని • బడసె నెవఁడు
సకల శాస్త్ర పురాణ • సారాంశవేత్తయై
వ్యవహారదక్షుఁడై • వరలెనెవఁడు
శ్రీశైల మల్లేశు • జంతించి మానియై
యద్వైత సిద్ధిని • నందెనెవఁడు
యోగమర్మంబుల • నొప్పుగాఁ దిలకించి
యభిమాన రహితుఁడై • నలరునెవఁడు

తే. గీ. యట్టి బ్రహ్మణ్యు మద్దేశి • కార్యవరుని
మల్లయాభిఖ్యు సతతంబు • మానసమున
దలచి మ్రొక్కుచునుండెదఁ • దనయుఁడనగు
కొల్లపాటి సుబ్రహ్మణ్య • కోవిదుండ॥— 104

ఇత్థం.